Reg. No. 757.

# అభినవసరస్వతి

యామునాక మాసపత్రిక.

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.




సంపుటము 16 | 1924 సం॥ డిసెంబరు. | సంచిక 9.

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry.

## చందా దయచేసిన ప్రధానపోషకులు.

౧ రామసింగుగారు - నెల్లుట్లసాపురసంస్థానముల మేనేజరు - నెల్లుట్ల.
౨ బాకరాజు పరాంకుశరావుగారు యాడవరం.
౩ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు
౪ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు

## పోషకులు.

౧ ఎనమండ్రి లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ
౨ రాజా వెంకటాద్రియప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు
౩ రాజామంత్రిప్రెగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగి-
౪ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు
౫ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము
౬ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుంచవరము
౭ చాగబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౮ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు నారాయణపురము
౯ డి. లక్ష్మణసింగుగారు, జొనగాం
౧౦ నెల్లుట్ల నరసింహారావుగారు, జొనగాం
౧౧ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె,
౧౨ కొకిలపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము
౧౩ శీతలసింగుగారు, మర్చెంటు, నాగవరము
౧౪ పిశుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౫ బొగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౧౬ యార్లగడ్డ రంగనాయకులు నాయుడుగారు, కారంచేడు

## సహాయులు.

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము
౨ నడింపల్లి నరసింహారావుగారు, జిల్లా రిజిస్ట్రారాఫీసు, గుంటూరు
౩ తాచకొండ వెంకటరామయ్యగారు, యెనమదల
౪ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౫ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తాలూకాదారు, [illegible]
౬ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు, బెజవాడ
౭ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౮ రంగరాజు గోపాలకిషన్‌రావు దేశముఖుగారు, సాపురం
౯ నారాయణరావుగారు, నాతాయపల్లె
౧౦ జేలూరి రామన్న గుప్తగారు - సదాశివునిపేట
౧౧ రామూరి సుబ్బయ్యగారు . శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి
౧౨ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం
౧౩ దండు గుండేరావుగారు, కరణము - ...
౧౪ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ...
౧౫ కామమాను హనుమయ్యగారు, నర్సారావుపేట
౧౬ పిల్లలమర్రి సోమరాజులుగారు, తహశీలుదారు, కురిచాల
౧౭ తిప్పరాజు రామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

# అభినవసరస్వతి

సంపుటము ౧౮. { జా ౧ పాదు రక్తాక్షి సం॥ మార్గశిరమాసము. } సంచిక ౯

కృతివిమర్శనము.

మర్గాదాసు — ఇది గుడివాడ హింద్‌పాఠశాలోపాధ్యాయులగు బంధ్యాల శివన్న శాస్త్రిగారిచే బంగాళీభాషనుండి యనువాదితమైన యొక నాటకము-ఈ శాస్త్రిగారు సంస్కృతాంధ్రములందు వ్యాకరణ విశేషములు చక్కని సాహిత్యముగలిగి యుభయభాషలందును బెక్కు [illegible] వ్రాసియుండిరి-తిరుపతి వెంకటేశ్వరకవులకు శిష్యులు-ఇటీవల వీరు హింద్ బంగాళా భాషల నభ్యసించి తదుభయభాషల యందును మంచిపాండిత్యము సంపాదించిరి. ఈనాటకము నిప్పటి నాటక సంఘములవారి కోర్కెననుసరించి కాంబోలు గద్యపద్యాత్మకముగాఁ గాక కేవలగద్యాత్మకముగానే రచించిరి-ఇప్పటి నాటకసంఘములవారి రుచులన్నియు విజాతీయములు-వీరికి శాస్త్రీయములైన పూర్వనాటకములుగాని ప్రకృతనాటకములుగాని పనికిరావు-కథా ప్రారంభమునుండియే ప్రదర్శింతురుకాని నటీసూత్రధారసంభాషణ రూపమగు ప్రస్తావన ప్రదర్శించుటకుఁగూడ బద్ధకింతురు-ఏతద్గ్రంథ కర్త సంస్కృతవాఙ్మయమునఁగల స్వారస్యమును గుర్తెఱింగియున్నను నవనాగరికమనోరంజనార్థమో స్వహృదయముగూడ నభినవముల రుచించుటచేతనో రసపుష్టిగల స్వీయకవితను గ్రంథపద్ధతులయందే యుపయోగించుచున్నవారు- అందువలననే యీనాటకమున నాందీ ప్రస్తావనలఁగూడ మానివేసిరి. ఇందలి కవిత్వము సుగమమును గంభీరమును విద్వత్తాద్యోతకమును నై శ్రోతాళువులగు చదువరుల మనంబుల నాకరించుచున్నది-గ్రంథము చరిత్రాత్మకము- మొగలులకును

రాజపుత్రులకును మహారాష్ట్రులకును జరిగిన యుద్ధాదు లిందు వర్ణితములు-అందు రాజపుత్రుల నిర్వక్రపరాక్రమ మగ్రగణ్యము-ఏతద్గ్రంథపాఠకులు దేశభక్తి స్వామిభక్తి కృతజ్ఞత పాతివ్రత్యము మున్నగు నుత్తమగుణముల నేర్చుకొందురు-ఇండియాచక్రవర్తియగు నౌరంగజేబు స్వమతప్రచారమునకై చేసిన హిందూదేవాలయ గ్రంథవినాశనాది దుష్కృత్యముల నివారింపఁజేయుటకై శత్రుమిత్రములొనర్చిన సద్బోధయే యద్యతన హిందూమహమ్మదీయుల యన్యోన్యమతకలహముల వారించి యైక్యమును గూర్పఁగలిగెడి-ఈనాటకమునవచ్చు పాత్రలలోనెల్ల దుర్గాదాసను రాజపుత్రుఁడు మార్వాడసేనాపతి శరణాగతత్రాణపరాయణుఁడును స్వామిభక్తుఁడును దేశాభిమానియును బరనారీసహోదరుఁడును మహావీరుఁడును వేయేల సకలసద్గుణసనాథుఁడును నగుటచే గ్రంథకర్త పరికృతానుగుణముగా నీనాటకమునకు దుర్గాదాసనియే నామమును విధించెను-ఇందుఁ బద్యములు పరిచయింపఁబడకున్నను విక్రమోర్వశీయాది సంస్కృతనాటకములంబోలె గీతికలు చేర్పఁబడియున్నయవి. యోధపుర (మార్వాడ) రాజగు యశోవంతసింహు నౌరంగజేబు కపటమార్గమున నాఫ్గనిస్థానమునకు యుద్ధముచేయఁబంపి చంపించి తద్రాజ్యమును ముట్టడించుటయు నతనిరాణియగు మహామాయ స్వరాజ్యము నుద్ధరించి మొగలులఁ బాఱఁదోలి తన నిజపతివ్రతాత్వము విశ్వవిఖ్యాతముగా సహగమనముఁజేయుటయు స్త్రీలుపాడిన పాట యొకటిమాత్ర మీదిగువ నుదాహరింపఁబడియెడి-కార్యబాహుళ్యముచే నొక్కనాఁడే యీనాటకమంతయుం జదువ వీలుపడక నాలుగైదుదినములు పట్టినను సమగ్రముగాఁ జదువనంతవఱకు స్వాంతము సంతుష్టిఁజెందకుండెననుటకంటె దీని ప్రాశస్త్యము వేఱ వ్రాయవలసియుండదు-ఇట్టిగ్రంథమును బత్రికాకార్యభరమున బహుదినములనుండి విప్పియైనను జూడఁదటస్థింపమికిఁ

బశ్చాత్తాపపడియెడి నాయెడల సద్భావమున కభిప్రాయమిచ్చెనని శివన్నశాస్త్రిగా రన్యథా తలఁపకుందురుగాక-ఇట్టిగ్రంథమును దమ యాంధ్రగ్రంథరత్నాకరమను గ్రంథమాల కాద్యరత్నముగాఁ గై కొనిన తత్సంపాదకులగు స॥ శివరావుగారు శ్లాఘాపాత్రులు-దీనివెల యాంధ్రగ్రంథరత్నమాల చందాదారులకు రు ౧-౦-౦; ఇతరులకు రు ౧-౪-౦. వలయువారు "మేనేజరు, ఆంధ్రగ్రంథరత్నాకరము, గుడివాడ, కృష్ణాజిల్లా" యనివ్రాసికొనవలెను.

గీతము

పతిలోకమునకు బోవమ్మా! యోసతీ! పుణ్యవతీ!
గతివేఱొక్కటి లేదమ్మా యింక సతులకు నీజగతి,
ప్రాపంచికశోకమ్ము లొడలితో భస్మమై పోవుగా
ఆపయిఁ బోయెదవమ్మ యక్షయంబౌ స్వర్గంబేవుగా
విను మదిగో జయదుందుభు లాకసమున మ్రోగుచునుండెగా,
గనుము సురావళి యల్లదె సుమవృష్టిని గురిపించుచునుండెగా.

—(౦)—

జి. యస్. బి. సరస్వతి దుర్బోధలు.

శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరిపీఠాధీశ్వరులు తెనాలి తాలూకా కొల్లూరుగ్రామములోఁజాతుర్మాస్యదీక్షనిర్వర్తించుచుండుటయుఁదత్కా-లమున నాయూరికమ్మవారుకొందఱు క్షత్రియంమన్యమానులై శ్రీస్వాములవారిసన్నిధిని మేము క్షత్రియులమగుదుమో కామో విమర్శించి తీర్మానింపుఁడని పిటీషను బెట్టుటయు నందుపై వారు సభకూర్చుటయు నం దుభయవాదులకును వాదోపవాదములునడచుటయు సద్వాదములు విని పీఠాధిపతులు తీరుపుచెప్పుటకు వాయిదావిధించుటయు భాద్రపదమాసపత్రికయందుఁ బ్రకటించియుంటిమి - తరువాత నిది భరతఖండమున కంతటికిని సంబంధించిన పెద్దవిషయముగుటవలన నితర

పీఠాధిపతులయుఁ దత్తద్దేశస్థ పండితులయు నభిప్రాయములఁబడయు టకై కమ్మవారియొక్కయు బ్రాహ్మణులయొక్కయు వాదముల సంగ్రహించి గ్రంథరూపముగా ముద్రింపించి వారివారికా పీఠాధ్యక్షులు పంపియున్నవారు. పండితుల యుద్దరుండి తమతమ యభిప్రాయములు క్రమముగా వ్రాసి పంపఁబడుచున్నవి. పుష్పగిరిస్వాములవారు నవరాత్రోత్సవములుగూడ నా కొల్లూరు గ్రామమునందే నిర్వర్తించి వెల్లటూరు పులివర్తి మున్నగు గ్రామంబుల సంచారముచేయుచున్నారు. రెండుమాసములు చాతుర్మాస్యవ్రతము శ్రీవారిచేఁ జేయించుటయేకాక నవరాత్రిమహోత్సవమునుగూడఁ దమచే జేయించిన కొల్లూరు బ్రాహ్మణులును నెలదినములపర్యంతము సపరివారముగాఁ దత్పీఠస్థుల స్వావాసమున నిలుపుకొని పూజించి పునీతులైన వెల్లటూరిబ్రాహ్మణులును బ్రశంసనీయులు. దేశజనుల భక్తి శ్రీపీఠాధిపులయెడల నింత యపారమై నెలయుచుండ స్త్రీశూద్రాదుల కందఱకును వేదపఠనాధికారముకలదని వివాహితులై పుత్రులను బౌత్రులనుగూడఁ గాంచి వార్ధక్యమునకువచ్చిన శూద్రులకుసహిత ముపనయనములుచేయించి జంధ్యములువేయించుచును కమ్మ రెడ్డి వెలమ కాఁపులు క్షత్రియులనిచెప్పుచును వీరు పీఠాధికారులుకారని ప్రలాపించుచును బీఠాధిపతులు దయచేయు నూరికెల్లఁ జని జి యస్ బి సరస్వతి యను నొకయతి తత్సంచారమున కడ్డుగలిగించుచున్నవాఁడు. ఈయన చరిత్రమంతయు మత్పత్రికాపాఠకులు పలుమాఱు నీపత్రికయందే పఠించియుండుటంజేసి మరలఁ దెలుపుటకుఁ బ్రయత్నింపము. తద్వాదమంతయు నశాస్త్రీయము నసంగతము నైయున్నది. ఈయన దుర్బోధలు బుద్ధిమంతులగు పెద్దమనుష్యుల తలల కెక్కకున్నను గొందఱు కమ్మవారికిమాత్ర మెక్కి బ్రాహ్మణులతోడనేమి పీఠాధిపతులతోడనేమి ప్రతిఘటించుచున్నవారు. స్వవాదమున నేకీభవింపనివారి కపకృతిగావించుటకుఁగూడ వెనుదీయకున్నవారు. ఇట్టిపట్ల సాధున

లగు ఛ్మాసురాదులకు సర్వేశ్వరుఁడే శరణ్యము

ఈ జి యస్ బి సరస్వతి కమ్మ రెడ్డి వెలమ కాఁపుల క్షత్రియత్వమును గూర్చి ప్రచ్ఛన్నరాజకులనిర్ణయమని స్వపత్రికయేకీర్తియమాణ జయార్థపత్రికాశికానామగ్రంథమున నొక భాగమును జేర్చియున్నవాఁడు. అందుఁ గల్యాదిని మహానందియను నొకక్షత్రియుఁడు శూద్రస్త్రీని పెండ్లాడి యామెయందు నందుఁడను నొకపుత్రుఁ గాంచెననియు నతఁడు బలవంతుఁడై రాజ్యమాక్రమించి క్షత్రియులనెల్లరను దనకు నమస్కరించి కొలుచుచుండఁ గోరెననియు వారలందుల కియ్యకొనమి యుద్ధమున నోడించి కారాగృహంబుల నుంచెననియు నట్లు పరాజితులై తుదకు నమస్కరించి స్వవర్ణోచితకర్మానుష్ఠానలోపమున యజ్ఞోపవీతపరిత్యాగపూర్వకముగా శూద్రప్రాయులై పోయిరనియుఁ గమ్మ రెడ్డి వెలమ కాఁపులు కర్మభ్రష్టులై శూద్రప్రాయులైన యా క్షత్రియులేయనియు నిరూపించియున్నాఁడు. అందులకు మార్కండేయ పురాణోత్తరభాగమందలివియని కొన్ని శ్లోకము లుదాహరించెను. ఆశ్లోకములలోఁ దత్కాలీన క్షత్రియులు నందరాజవిజితులై కర్మలోపమున శూద్రప్రాయులైరనిమాత్రమే కలదు కాని యా కర్మభ్రష్టులైన క్షత్రియులే యద్యతనులగు కమ్మ రెడ్డి వెలమ కాఁపులనునది కానరాదు. ఇదియంతయు జి యస్ బి సరస్వతి యనుమానప్రమాణమున సాధింపఁజూచుచున్నవాఁడు. కాని యిప్పటి కమ్మ రెడ్డి వెలమ కాఁపువారలే యాశూద్రప్రాయులైన క్షత్రియులని నిర్ధారణచేయుటకు వలసినంత సాధనసామగ్రి కనుపట్టదు. జి యస్ బి సరస్వతిగారందులకై చూపెడి సాధనములు చాలవు. అది యట్లుండనిండు. మార్కండేయపురాణోత్తరభాగమందే శూద్రాపుత్రుఁడైన నందునకు సుమాల్య కమ్మ రెడ్డి వెలమప్రభృతులగు నెనమండ్రుగురుసుతు లుదయించి తత్తద్దేశములఁ బాలించిన ట్లుండెనని గుడివాడ తాలూకా కానుకొలను

గ్రామవాస్తవ్యులైన వాదిమత్తేభకంఠీరవ సింహాద్య్రప్పళాచార్యులు గారను నొక విశిష్టాద్వైతిపండితులు కొన్ని శ్లోకములఁదీసికొని కొల్లూరులో జరిగిన మతసభకువచ్చి శ్రీపుష్పగిరిపీఠాధిపతుల సన్నిధిని సమర్పించిరి. వారు వానినిగూడఁ దమరికార్డునఁ జేర్చుకొని పండితాభిప్రాయములఁబడయుటకుఁగాఁ బంపిన వాదసంగ్రహమునం దీవిషయమును జేర్చియున్నవారు అయ్యుభయవాదములను దత్తద్దేశస్థపండితుల యభిప్రాయములను బరిశీలించిన పిమ్మట గారి శాస్త్రసమ్మతమైన స్వాభిప్రాయమును శ్రీజగద్గురు పుష్పగిరిపీఠాధిపతులు ప్రకటింపఁ జేయరు.

ప్రక్రమమంతయు నిట్లుండ శాస్త్రవిరుద్ధాచారప్రవర్తకుఁడై బ్రాహ్మణద్వేషియు లోకగర్హితుఁడును నగు జి యస్ బి సరస్వతి శంకరగురుపరంపరాగతులును సన్మతాచారప్రవర్తకులును నగు శ్రీ పుష్పగిరిపీఠాధిపతులపైఁ గూడ ద్వేషించి లోకానుగ్రహార్థమై వారు చేయు సంచారమున కంతరాయముగలిగింపవలెనను దురూహతో మహానందియనుక్షత్రియునకు శూద్రాపుత్రుఁడైన నందుని సంతతివారలగుటచే నీ కమ్మరెడ్డి వెలమసంఘమువా రనులోమసంకరులనునది శ్రీపుష్పగిరిస్వాములవారే చెప్పుచుండిరని యిదివఱకుఁ దనదుర్బోధలఁ బెడచెవినబెట్టెడి పెద్దమనుష్యుల మనంబులఁగూడఁ గలవరపెట్టుటకు విశ్వప్రయత్నములఁ జేయుచున్నవాఁడు. రేపల్లెతాలూకా వేమవర నామకగ్రామమున శ్రీ శ్రీ స్వాములవారు ప్రవేశించుటకుముందు నలుగురు కమ్మయువకులఁ గూడుకొని జి యస్ బి స॥ గారు ప్రత్యక్షమై తమపంచాంగము విప్పుటకుఁ బ్రయత్నించుటయు నాయూరి కరణమగు తాడేపల్లి రత్నయ్యగారు మంచిమాటలతో మందలించి యవల కనిచిరి. అంతట బలపౌరుషాదులచే క్షత్రియత్వము సాధింపఁజూచెడి కమ్మమహాజనులకు ముఖ్యస్థానమైన దోనెప్పూడిగ్రామమునుండి తద్వేమ

నరసమీపస్థలమగు సూరేపల్లికి దేవబ్రాహ్మణులయందు భక్తివిశ్వాసములుగలిగి పూర్వాచారపరాయణతం బ్రవర్తిల్లెడి వెలమవారిపేరం బైకారణము లుదాహరించుచుం బుష్పగిరిపీఠాధిపతులం బూజింపవలదని యుద్రేకనిదానమగు నొకపత్రిక వ్రాసెనుగాని వార లయ్యది బుట్టదాఖలుచేసి శ్రీస్వాములవారి నాహ్వానించి తమయూరికిం గొంపోయి కొన్నిదినము లుంచుకొని యర్హపూజాకరణంబున వారిం బరితృప్తులంగావించి పునీతులైరి. ఇట్లీయన యెన్నిప్రయత్నములు చేయుచున్నను ధర్మిష్ఠులు వారిని బూజించుచునే యున్నవారు. జి యస్ బి దుండగముల నణంప యోజించుచునేయున్నవారు. కాని కమ్మమహాజనులుమాత్రము కొంతమంది యాయన వలలోం బడుచున్నవారు. వెల్లటూరి బ్రాహ్మణులు నెలదినము లీపీఠాధిపతుల నిల్పికొని మహావైభవముతోం బ్రతివారును భిక్షాపాదపూజాదులు జరిపించియుండ జి యస్ బి గాలిగాని తదనుయాయులగాలిగాని సోకకుండినచోం దద్గ్రామాధికారులగు తిరుపతిరాయఁడుగారు నట్టి పెద్దమనుష్యులే యైన మఱికొందఱును శ్రీవారి నేలపూజింపకుందురు? కావున నీగాలిని బాఱఁద్రోలుటకు ధర్మిష్ఠులగుజనులు ప్రయత్నింపవలసియున్నది. వ్యవహారవిదులు తద్బంధ నోపాయముల నాలోచింపవలసియున్నది. మఱియును బుష్పగిరిపీఠాధిపతు లీదేశమునకుం జిరకాలమునుండియు మతగురువులు. బ్రిటీషువారు పరిపాలకులు. పరిపాల్యుల కష్టముల విచారించి సుఖములొడఁగూర్చుట పరిపాలకులపని. వారు తమమతగురువులయెడల భక్తిశ్రద్ధలు గలిగి మతవిషయమునం దదాజ్ఞయవ్యాహతమైయుండ సంచరింపఁజేయుచున్నారు. అట్టిశ్రద్ధ స్వపరిపాల్యమానదేశ మతగురువులయెడలంగూడ నుంచవలసియున్నది. కావున నస్మన్మతగురువులగు పుష్పగిరిపీఠాధిపతుల సంచారమునకు లోకులకు దుర్బోధలుచేయుటమూలమున నడ్డుగలిగించుచున్న జి యస్ బి సర

స్వాతిని విచారించి శిక్షింపఁ బ్రభుత్వమువారు ప్రార్థితులు. ఈయన లోకమునఁ మతకలహములు పెట్టి కలవరపఱచుచున్నవాఁడు. ఈయన యేశాస్త్రముల క్షత్రియులని ప్రతిపాదించుచున్నాఁడో యాశాస్త్రములే యనేకులు తద్వాదమును ఖండించుచున్నారు. అందొక్కటి యిక్రిందఁ గనఁబఱచుచున్నవారము.

——(o)——

దాసశబ్దార్థచంద్రికా విమర్శన పరిశోధన ఖండన మండనము.

సత్యజ్ఞానము లేమిం జేసి దూరాలోచనము లేకయును, స్వార్థపరత్వముచే కుత్సితపు సంకల్పములకు లోనయియును, సంఘములో వృథాద్వేషములు పెంచి స్వలాభప్రాప్తినందనెంచు జి. యస్. బి. యనువారు దాసశబ్దమునకు 'లంజకొడుకను' నీచార్థమును స్వీయముగ కల్పించి లోకమున కనర్థమును కలిగించుచున్నారు. వీరిమాయలల్లోఁబడి కొందఱు మావిద్యార్థిసోదరులు పిచ్చియూహలకు లోనగుచున్నారు. ఈ యనర్థమును తొలగించుటకై 'దాసశబ్దార్థచంద్రికా విమర్శన పరిశోధన'మను గ్రంథమును వ్రాసి ప్రచురించితిని. కానిరోగి కన్నము చేదుగాగాన్పించిన రీతిగను పథ్యము రుచింపనివిధముగను జి. యస్. బి. బ్రాహ్మపక్షీయులగు మాసోదరులకు కొందఱికి నాహితోబోధ రుచింపకపోవుటచే వారు 'దాసశబ్దార్థచంద్రికా విమర్శన పరిశోధన ఖండన'మను కుత్సిత విమర్శనము నొక దానిని దుష్పాండిత్య దుర్విదగ్ధుల సాహాయ్యముతో నొనరించి క్రొత్తగఁ బ్రచురించిరి. ఇందున్నది నిస్సారమగు చెత్తవ్రాత. న్యాయముచే దానికి దిరుగ సమాధానమీయవలసినయవసరమే లేదు. కానియింతప్పత్రోవలందుఁ దుదకుఁ బడుచున్నవారు మాశాస్త్రసోదరులే కావునవట్టివారి బాగునుగోరి తిరిగ సమాధానమీయవలసినయావసరము కలిగినది. వీరిఖండనము ప్రధాన విషయ విమర్శనము లేక శాఖాచంక్రమణములతో

నిండియుండే సత్యదూరమై నిస్సారమై యప్రాజ్ఞ లిఖితమని తనంతటఁ దానే ప్రకటించుకొనుచున్నది. ఇట్టివ్రాఁతల వ్రాయువిద్యార్థులంగని జాలిపడి సద్బోధ వారికి కలిగించుట యత్యవసరము కాని వీరి ముగ్ధత నాధారముగ దీసికొని తమ కుత్సితవాదమును మఱల లోకములో వ్యాపింపచేయనెంచి యీముగ్ధుల కాకుటిల ఖండనము వ్రాయుటలో సాయమొనర్చిన యీపండితంమన్యుల దుష్పాండిత్యము సర్వవిధముల గర్హించి తృణీకరింపవలసియున్నది. ఇట్టజ్ఞానలవ దుర్విదగ్ధులకు సద్బుద్ధి గలిగింపఁగలవారుండఁజాలరు. అయినను మావిద్యార్థి సోదరులకు దుర్బోధలు గావించుచున్న యీదేవానాం ప్రియులకును మాచిన్న సోదర విద్యార్థులకును సత్యజ్ఞానమలవడుటకై యీపునర్విమర్శనమును బ్రకటించుచున్నాడను. జి. యస్. బి. గారి స్వార్థపరత్వము వారిని సరియగు మార్గమున పెట్టినను పెట్టకున్నను దీనింబట్టి మాచిట్టివిద్యార్థులయినను సద్బోధ యేదియో దుర్బోధ యేదియో తెలిసికొని పెద్దల మార్గం బవలంబించి బాగుపడుదురుగాక.

## శూద్రులెవరు?

నావ్రాసిన పరిశోధనమందలి పీఠికలో రెండవపుటయందు నాది కాపుకులమని వ్రాయబడియున్నది. నాగ్రంథములో రెండవ పుటలో నిది మాశూద్రులతో సంబంధించిన విషయమని నేను వ్రాసి యుంటిని. ఇందులకు మాచిట్టివిద్యార్థులు కినిసి నాది శూద్రకులము కాదనియు కాపులకులమనియు కాపులు క్షత్రియులు కాని శూద్రులు కారనియు నేనజ్ఞుడనై శూద్రుడననుకొనుచున్నాననియు నేమేమో వ్రాసి నావిషయములో చాల జాలిపడిరి. వీరి యీముగ్ధతంగని నాకు మఱింత జాలియగుచున్నది. ఏమన మా కాపు, కమ్మ, వెలమ, రెడ్డి కులజులెల్లరు జి. యస్. బి. జ్వరము సోకుటకుపూర్వము తాము

శూద్రులమనియే చెప్పుకొనుచుండెడివారు. ఇందులకు నికొలజాలు వ్రాసినట్టియు వీరిపై నితరులు వ్రాసి వీరిసమ్మతిని బడసినట్టియు గ్రంథ రాజములే సాక్ష్యము. జి. యస్. బి. జ్వరసంధిలో పలవరించుచున్న క్షత్రియత్వమే మాకుండునెడల మాశూద్రపదవాచ్యత దాని కభ్యంతర మెంత మాత్రమును తేజాలదు. యేమన, జి. యస్. బి. గారి వాదవైఖరిని బట్టియే "కమ్మ" లోనగు శబ్దములకంటె శూద్ర శబ్దమే హెచ్చుగ క్షత్రియత్వమును బోధించుచున్నది. ఎట్లన:—

శూ ద్రు లే క్ష త్రి యు లు .

చౌదరిశబ్దము క్షత్రియత్వబోధకమని జి. యస్. బి. గారు తమ జయార్క పత్రికాశిక 3 వ సంపుటము 83 వ పుటలో లిఖించియుండిరి. ఆచౌదరిశబ్దము శూద్రశబ్దభవముగాని జి. యస్. బి. గారూహించినట్లుగా చక్రధారిశబ్దమునుండి బుట్టినదికాదు. చక్రధారి శబ్దమునుండి తద్భవములు పుట్టిన చక్కదారిలోనగురూపములు కలుగునుకాని, చౌదరిలోనగు రూపములు కలుగవు. 'చక్రవాకా'ది శబ్దములనుండి జక్కవాదిశబ్దములు పుట్టుచున్నసంగతి చదువరులు గ్రహించుకొనవలెను. ఒకభాషనుండి యింకనొకభాషలోనికిపదములు మారునప్పుడు శ,ష,స, చ లొకదానికొకటి వచ్చుచుండును. అందులో తెలుంగున శవర్ణము లేదు. కావున దానికి బదులుగ స, చలు వచ్చుచుండును. శక్తి = సత్తి; శయ్య=సెజ్జ; శంఖ=సంకు; శరధారి=సరదారు శాణ=సాన శష్కులీ=చక్కిలము శర్కర=చక్కెరలోనగునవి యుదాహరణములు. ఇంకనుసంయుక్తాక్షరములు విశేషించి రేఫయుక్తములు రెండును విడిపడి ప్రత్యేకస్థితినందుటకలదు. చంద్రః= చందురుడు, సముద్రః=సందరము, నిద్ర=నిదుర; యాత్ర=జాతర లోనగునవి యుదాహరణములు వేనవేలుకలవు. కావున నీతద్భవశాస్త్ర

మునను సరించియే, శూద్రశబ్దము సూదరయయినది. శూదరశబ్దము శూద్రశబ్ద వాచ్యమేయయినట్లుగా జి. యస్. బి. గారు తమజయార్థ పత్రికాశిక 3వ సంపుటములో 121 వ పుటలో నంగీకరించియున్నారు. వారాంధ్రపరాశరస్మృతినుండి యీదిగువ పద్యము నుదాహరించిరి.

క॥ చిరకాలమిత్త్రుడును సూదరవనితకు

సూదరవనితయన శూద్రస్త్రీ యని జి. యస్. బి. గారు స్వహస్తములతో వ్రాసిరి. ఈసూదరశబ్దమే చౌదరియయినది. లోక వ్యవహారములో 'స' కు 'చ' వచ్చుచుండుటవాడుక. సల్కిశబ్దమే చల్కి, చలుక్కి మున్నగు రూపములనందినదని శబ్దశాస్త్రజ్ఞులై కీర్తిశేషులైన కొమర్రాజు వెంకటలక్ష్మణరావుపంతులుగారు మున్నగు వారు వ్రాసియున్నారు. సదః = చదురు; సన = చను, సేవంతి= చేమంతి లోనగునవి యుదాహరణములు. కాబట్టి 'సూదర' శబ్దమే 'చవుదరి' 'చౌదరి'యను శబ్దములుగామారినది. కావుననే నిఘంటువులు చౌదరి శబ్దమునకు శూద్రుడను నర్థమును నిచ్చుచున్నవి. చవుదరి శబ్దము క్షత్త్రియవాచకమని యొప్పుకొన్నచో అప్పుడే శూద్ర శబ్దమును క్షత్త్రియవాచకమని యొప్పుకొనవలెను. మఱియు నుపనిషత్తులలో జానశ్రుతియను భూపాలకుడు శూద్రశబ్దముచే సంబోధింపబడి యున్నాడు. ఈజానశ్రుతి భూపతియయి యుండుటచే మన జి. యస్. బి. గారిమతమును ననుసరించి క్షత్త్రియుడు గాక తప్పదు. ఇంకను సీతడు క్షత్త్రియుడేయని శంకర, రామానుజ, మధ్వాది పూజ్యపాదులెల్లరును నొక్కి వక్కాణించి యున్నారు. ఇంతయేల ! నారాయణావతారమూర్తులగు వ్యాసభట్టారకులవారే యీతడు క్షత్త్రియుడని సూత్రీకరించిరి. ఇంకను శూద్రకుడు క్షత్రియుడని మృచ్ఛకటికము తెలుపుచున్నది. అతఃశూద్రులెల్లను క్షత్రియులే. పాపము మా జి. యస్. బి. గారును వారి శిష్యప్రకాండులును నీరహస్యమును

గ్రహించుకొనజాలక పెడచేతివ్రాతలను వ్రాయుచున్నారు. అజ్ఞానాంధకారనిమగ్నులై జి యస్ బి గారు తమ 'దాసశబ్దార్థచంద్రికా విమర్శనము'లో నిట్లు తప్పువ్రాతలు వ్రాసిరి. [సశేషము.]

# బహిరంగలేఖ.

శ్రీమత్కల్యాణానంద భారతీస్వామివారికి
వందనపూర్వకముగా చేయుమనవి.

తాము రుధిరోద్గారి సం॥ మాఘ శుక్ల ద్వితీయ మొదలుకొని ప్రచురించుచున్న శ్రీముఖములనెడి పత్రికలను బహిష్కార పత్రికలనువానిని తమమీద సిద్ధాంతములనుండు చాతుర్వర్ణ్యమువారలు ప్రచురించిన పత్రికల చూచుచుంటిని. తముచే ప్రచురింపబడు పత్రికలు శ్రీజగద్గురు పీఠాధికారులను యిప్పుడాంధ్రదేశమందున్న పండితాగ్రేసరులను దూషించుచు కృతికఠోరములుగ నుండినను తమయం దభిమానము గలవా రొకరిద్దరుదక్క జనసామాన్యముచే నాపత్రిక లన్నియు తిరస్కరింపబడుచుండుటచేతను తమకున్న యసూయాది గుణములుగాక యితరకారణము లాపత్రికలలో గనుపించక పోవుట చేతను నాకున్న స్వాభావికమగు నుపేక్షాభావముచేతను నింతవరకు వానినుపేక్షించుట తటస్థించినది. మౌన మంగీకార సూచకమను న్యాయ ముదాహరించి యుపేక్షాభావ మంగీకారముగ తాము ప్రకటించుకొనుటచేతను చాతుర్వర్ణ్య శిష్యబృందమునకని తాము వ్రాసితిరి గనుకను మాకందరకు ప్రత్యుత్తర మీయవలసి వచ్చినందున నీవిజ్ఞాపనము వ్రాయుచున్నాడను.

ఇట్టి పత్రికను వ్రాయుటకు తమకెట్టి యధికారముగలదో ఆసంగతి విచారించుటకై యత్నించితిని. తేలిన యంశములను తమకు జ్ఞాపకముచేయుచు నిజము తెలియుటకై బహిరంగముగ వెల్లడించుచున్నాను.

తమ గురువుగారగు బోధానందభారతులు (కాశీచయనులు గారు) అభినవవిరూపాక్షపీఠాధిపతులగు శంకరభారతులకు (యనమండ్రి నృసింహశాస్త్రిగారికి) శిష్యులుకారు. వారు సిద్ధిచెందిన పదకొండు దినములకు దేశాంతరమునుండి వచ్చిన విదంతులు. గనుక అభినవవిరూపాక్ష పీఠాధిపత్యము యనమండ్రి స్వాములవారితో అంతరించినది. బోధానందశిష్యులగు తమకు పీఠాధిపత్యము సుతరాము లేదు.

రాజమహేంద్రవరము మొదటి సబార్డినేటు జడ్జికోర్టులో రాజమండ్రి డిస్ట్రిక్టు మున్సబుకోర్టు అసలు నెం 127/1912 రు పైన అపీలులో 6-9-1915 తేదిని మీగురువుగారికి పీఠాధికారము యేవిధముగను లేదని తీర్మానింపబడినది. ఇట్టివి యింకా చాలాగలవు.

ప్రస్తుతము పుష్పగిరి పీఠాధిపతులు వారి గురువుగారికి ఆకస్మికముగ విపత్తుసంభవించినపుడు వారిసమీపమున చిరకాలమునుండి సేవజేయుచు తత్కృపాపాత్రులై వర్తించిన బ్రి॥ గింజుపల్లి చక్రియ్యగారికి ఆతురసన్యాసప్రదాన మంత్రోపదేశ పూర్వకముగా పీఠాధికారమిచ్చి సిద్ధిచెందిరి. సన్నిధి పండితులును యతులును యావద్ధర్మములను తత్పూర్వ సంప్రదాయానుసారము బోధించిరి. పీఠములకు దేశకాలవైపరీత్యముల వలన విపత్తులు వాటిల్లినపుడు పూర్వపీఠాధిపతుల యాజ్ఞానుసారము యిట్టిసవరణలు జరుగుటయు అయ్యవి మహాజనసంప్రతిపన్నము లగుటయు శ్రీశృంగగిర్యాది స్థలములలో గనియున్నారము. ఈసంగతులు పూర్వస్వాముల యవసాన కాలమందు వారి సమీపములోనున్న వారి వాక్యముల వలనను శ్రీవారివద్ద రికార్డువలనను విశదమగుచున్నవి. ఈసంగతి యదార్థమని యంగీకరించి రెండుసంవత్సరములనుంచి మార్కాపురం వినుకొండ, పల్నాడు, నర్సారావుపేట, సత్తెనపల్లి, గుంటూరు, బాపట్ల, తెనాలి మొదలగు తాలూకాలలోని చాతుర్వర్ణ్యముల

వారు పీఠమునకును శ్రీ స్వామివారికిని లోకోత్తరమగు సపర్య చేయు చున్నవారలు. ఈ జనము గ్రహించుటకు తత్సమీపస్థితులకంటె తమకు నేమాత్రము వీలుండదుగదా? అసహనము, నిష్కారణ ద్వేషము, పాపదాయకములను సంగతి తమకు తెలియునిదికాదు.

...     ...     ...     ...

బ్రహ్మశ్రీ గొల్లపూడి లక్ష్మణశాస్త్రి సోమయాజులుగారు వేదశాస్త్రవిదులు. శిష్టులు. వారును బ్రహ్మశ్రీ సీతారామచయనులు గారును ధర్మ ప్రచారకులుగా నుండుట దోషముగునా? బ్రహ్మశ్రీ దెందుకూరి నరశింహ శాస్త్రులుగారు సుప్రసిద్ధ విద్వాంసులు. శిష్టా గ్రేసరులు. అట్టివారిని బహిష్కరించితిరి. వీరియందు బహిష్కరిం చుటకు కారణమేమిగలదు. మా దేశగురువులగు నిప్పటి శ్రీ పుష్పగిరి పీఠాధ్యక్షుల తూలనాడుచు వ్రాయుటచాలా కర్ణకఠోరముగనున్నది. మీరుచేయు ధర్మనిర్ణయముల పద్ధతి యుక్తముగ లేదు. నన్ను సభ్యునిగా నంగీకరించినప్పుడు నాసమ్మతి పొందకనే శ్రీ పుష్పగిరి పీఠాధ్యక్షుల తొలగించి మరియొకరి కాయధికార మిచ్చితిమని మీకేమాత్రము లేనియధికారము నుపయోగించుచు వ్రాయుట కేవలాసంగతముగ నున్నది. మీసభలో సభ్యునిగానుండుటకు నాకి ష్టములేదు అని ఇట్టి యుత్తరమును వ్రాయుటయేగదా యీపండిత ప్రకాండుని బహిష్కార కారణము?

శ్లో॥ గురోర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః
ఉత్పథం ప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే॥

అను శాస్త్రప్రకారము శాస్త్రులవారు తమను పరిత్యజిం చుట శాస్త్రీయమై యుండగా విపరీతగ్రహణము చేసుకొని వారిని బహిష్కరించితిమని వ్రాయుట తమకుగల దురాగ్రహమును సూచించుచున్నది.

బాపట్ల, నర్సారావుపేట, గుంటూరు, చెరుకూరు, నంబూరు, మత్రిప్రూడి, గోరంట్ల, అగ్రహారం, చినముక్కాన అగ్రహారము, వగైరా గ్రామములనుండి తమవద్దకును శ్రీ పుష్పగిరి పీఠాధ్యక్షుల యొద్దకును వచ్చినమహజరు పత్రికలనుబట్టి యిప్పటిపుష్పగిరి పీఠాధ్యక్షులందు చాతుర్వర్ణ్యముల వారికెంతటి భక్తిశ్రద్ధలు కలవో తమ యందెంతటి యుపేక్షాభావము కలదో సులభముగా గ్రహింపవచ్చును. ఇట్టి పత్రికల జూచియు తమరు శ్రీ పుష్పగిరి పీఠాధ్యక్షులపై ద్వేషించుట తమ యసహనమును నిష్కారణ ద్వేషమును వెల్లడించును. తాము పామరులు గూడ నుచ్చరింపరాని దూషణ వాక్యములను శ్రీ పుష్పగిరి పీఠాధ్యక్షుల విషయమై యుపయోగించుచున్నారు. ఇప్పటిపుష్పగిరి పీఠాధ్యక్షులు శమదమాది మహాగుణవంతులు. శిష్టులు విరక్తులు. విద్వాంసులు. వారిని పరశివావతారమనియె జనులు భావించుచున్నారు. ఒకరిద్దరు ద్వేషించుట యకించిత్కరము. శ్రీకృష్ణుని శిశుపాలాదులు ద్వేషించలేదా ? ఇట్టి శ్రీపుష్పగిరి స్వామివారిని బహిష్కరించితి మని వ్రాయుట ఘూకము సూర్యుని బహిష్కరించితి ననునట్లుండునని వ్రాయవలసి వచ్చినందులకు చింతించుచున్నాను. వారును తమకు తిరుగ బహిష్కారమని వ్రాయవచ్చునుగాని యిదివరకే శిష్టజన బహిష్కృతులగు తమకు బహిష్కార పత్రిక యనవసరమని విరమించియుందురు.

... ... ...

గంజాం జిల్లాలో అభినవవిరూపాక్ష పీఠము సంచరించుచున్నది. రాజరాజేశ్వరి పీఠమనియు దానికి పేరు. వారు శ్రీహంపి విరూపాక్ష పీఠాధ్యక్షుల వలన సంపూర్ణాధికారముపొంది సంచరించుచున్నారు. వారికిగూడ సీలు శ్రీచక్రముగలవు. వారుండగ తమకు పీఠమెక్కడిది ?

ఇదిగాక జన్మాంతర కర్మవశమున తమకెట్లునో సన్యాసము ఘటించినది. సంస్కృతభాషా ప్రవేశము గూడకలదు. శమదమాదులు కలిగి బ్రహ్మానందముతో కాలము గడుపుటమాని సర్వ

కాల సర్వావస్థల యందును పరదూషణ పరద్రవ్యాభిలాషములు కలిగియుండుటయు యతినింద్యములగు తాంబూలచర్వణ విదేశీకంచుకధారణ మ్లేచ్ఛభాషోచ్చారణాదికములతో కాలము గడుపుటయు కడుశోచనీయము. తమను ద్వేషాసహనములచే నెందరు పండితులకు నెందరు మఠాధిపతులకు బహిష్కారమని వ్రాసినను అది నిష్ప్రయోజనము. తమ కేవిధమగు నధికారమును చాతుర్వర్ణ్యములపై లేదు. అధికారము లేనివారల మాటలుకూడా చెల్లునెడల తమను గోదావరిజిల్లాను సమగ్రముగా నగ్రహార మిచ్చితిని. ఆచంద్రార్కము శిష్య పరంపరయా అనుభవించు చుండవలసినది. మీ కాభూమియందు స్వత్వములేదు. గనుక మీ దానపత్రము చెల్లదని నన్ననియెదరా ? తమకు పీఠాధికారము లేదు. తమ బహిష్కారపత్రమునకిదియే రీతి. ఈసంగతులను శాంతస్వభావముతో గమనించి యిదివరకు వ్రాసిన దూషణపత్రికలం గూర్చి తమయంతరాత్మను క్షమాపణ వేడుకొనుచు పండితసౌఖ్యమును సంపాదించికొని బ్రహ్మానందముతో కాలము గడపుట మంచిపని యని వినయపూర్వకముగా వ్రాయుచున్నాను. తమరు వ్రాసిన పరుషవచనముల కీశైలి సరియైనది కాదు. తాము కాషాయవసనులు గనుక నింతకంటె వ్రాయుట యుక్తము కాదని తోచివిరమించితిని.

శాంత స్వభావులకు కూడ కోపమురప్పించెడి తమరు వ్రాసిన పరుషవచనపూరితములగు పత్రికల వలన శ్రీ జగద్గురు పుష్పగిరి పీఠాధ్యక్షులు వగైరాలు యభియోగముల దెచ్చిన యెడల తమ కెట్టి చిక్కులు ఘటించునో యను భీతిచే తమ హితమునకై యీపత్రిక వ్రాసితిని.

ఈ పత్రికనుజూచి తాము చేయబోవు సత్కారము నాకు దెలియును. పైవారలతోపాటు నన్నునిందించెదరు. లేక బహిష్కరించెదరు. అట్టి బహిష్కారాదులు బహుమానపురస్సర సత్కారమనే నెంచియే వ్రాయుచున్నాను.

బెజవాడ.
10—10—1924

చిత్తగింపుడు,
వేమూరి శివస్వామి శాస్త్రి.

రథకారకుల మేవిధమునజన్మించినసంగతిని రథకారస్తుమాహిష్యాత్తను శ్లోకమునఁజెప్పి సంకీర్ణప్రసంగమున మఱికొందఱ సంకీర్ణులని చెప్పి రథకారపర్యాయపదముల "తక్షాతువర్ధకిస్త్వష్టా" యని చెప్పి యున్నది. ఇటులనే చండాలజాత్యుత్పత్తి నొకస్థలమునను బర్యాయపదములు మఱియొకస్థలమునను జెప్పెను. ఇంతమాత్రమున నుభయులకు భేదముఁజెప్ప వలనుపడదు. ఆచాండాలాత్తు సంకీర్ణా అనువచనము చండాలశబ్దపర్యంతము సంకీర్ణవాచకములనిమాత్రమే చెప్పెనుగాని అటుపైని సంకీర్ణవాచకములు లేవని చెప్పనేరదు. అటులఁజెప్పినయెడల వాక్యమునకు ద్వ్యర్థదోషమువచ్చును. కనుకనే "ఆచండాలా" త్తను శ్లోకమునకుఁబైనఁజెప్పఁబడిన లోహకార స్వర్ణకారులు (కమ్మరకంసాలులు) రథకారులతో (వడ్రంగులతో) సమముగా నుపనయన సంస్కారము కలిగియున్నారు. శూద్రులలోఁబరిగణింపఁబడుట లేదు. వారును సంకీర్ణులే చండాలురవిషయమైకూడ జాత్యుత్పత్తి నొకస్థలమునను దత్పర్యాయములు మఱియొకస్థలమునను జెప్పినంతమాత్రమునఁ జండాల ద్వైవిధ్యము కల్పించుట యపసిద్ధాంతము. జాతిశూద్రులలోఁ జేరిన రథకారుఁడు మూఁడవవాఁడు కలఁడనుటయు నభూతకల్పన. శ్రుతిస్మృతి తద్వ్యాఖ్యలలో నెక్కడను నట్టివాఁడున్నట్టు పేర్కొనఁబడ లేదు. ఒకవర్గములోననే యుత్పత్తి నొకస్థలమునను సంకీర్ణవర్ణోత్పత్తి ప్రకరణమును ముగించి పర్యాయముల మఱియొక స్థలమునను జెప్పినందున వీరిద్దఱు నొక్కరేయని నేను జెప్పఁగా నుగ్రశబ్దమొకచోట సంకీర్ణవాచకముగాఁ జెప్పఁబడినది. మఱియొకచోట శివునకు వాచకముగాఁ జెప్పఁబడినది. శివుఁడును సంకీర్ణుఁడు నొక్కఁడేయని యనఁదగదుగదాయని యాపత్తినిచ్చిరి.

దేవతాప్రకరణమున శివపర్యాయములలోఁ జెప్పిన యుగ్రశబ్దము సంకీర్ణవాచకము గాకపోవచ్చును. శివపర్యాయశబ్దములు శివశక్తి

గ్రాహకములు. సంకీర్ణబాధకములు. తక్షాతువర్ధకిస్త్వష్టారథకారశ్చ యనునప్పుడు సంకీర్ణరథకారార్థబాధకములును స్వతంత్రశూద్రరథకారజాతిసాధకములు నగు పర్యాయపదములు లేనందున నీ తక్షరథకారు లొక్కరేయనుట యుక్తము. ఒకశబ్దమునకు నానార్థము లుండవనుట నావాదముకాదు. ఇక్కడ రథకారులిద్దఱు లేరని నేనుజెప్పితిని. శూద్రులలో నిరవసితానిరవసితభేదమున్నటుల స్మృతికర్త లెవ్వరును జెప్పియుండలేదు. ధర్మశాస్త్రనిబంధనకారు లెవ్వరును నుదాహరించియుండలేదు. వర్ణాశ్రమభేదములను సంకీర్ణభేదములను దద్ధర్మములను జెప్పుటయందు స్మృతికర్తలే స్వతంత్రులు. వర్ణాశ్రమేతరాణాం నో బ్రూహి ధర్మానశేషతయని ప్రశ్నపూర్వకముగాఁ బ్రవర్తించినగ్రంథములుతప్ప నిఘంట్వాదులు విషయమై ప్రమాణములు కావు. నిఘంటువులోనను వారివాదమున కనుకూల మేమియు లేదు. ఇట్టి సకలప్రమాణములకు విరుద్ధముగాఁ జెప్పెడి వీరివాదము ధర్మనిర్మూలనము; శిష్టపండితగ్రాహ్యము కాదు. ఇఁక శూద్రాణా మనిరవసితానా మను సూత్రమున శూద్రపదము లాక్షణికముగాక జాతిశూద్రవాచకమైనయెడలఁ దక్షజాతిశూద్రుఁడుకానందున "తయస్కార" మను రూపము సిద్ధింపను. సంకీర్ణానామని సూత్రము రచింపఁబడినయెడల సంకీర్ణులలో లెక్కింపఁబడని రజకతంతువాయులకు సమాహారద్వంద్వమందు రజకతంతువాయమనురూపము సిద్ధింపదు సంకీర్ణశబ్దముకంటె శూద్రశబ్దమం దక్షరలాఘవముకలదు. కనుక శూద్రాణా మనిరవసితానామని సూత్రము రచింపఁబడినది. శూద్రశబ్దము త్రైవర్ణికేతరమనుష్యపరమని తత్త్వబోధినీకారులు న్యాయదృష్టికల మహాపండితులును మహాభాష్య కైయ్యటాద్యర్థముల బాగుగా గ్రహించినవారలుగనుక వ్రాసిరి. శ్రమపడి విచారించినఁగాని వారిభావము మనకు బోధపడదు. జనులకు నిజము తెలియఁజేయుటకై యీసూత్రములోని వ్యాకరణమహాభాష్యపంక్తుల నుదాహరించెదను.

సూ॥ శూద్రాణా మనిరవసితానాం॥

మహాభాష్యం॥

అనిరవసితానామితి ఉచ్యతే ఆర్యావర్తా దనిరవసితానాం; కః పున రార్యావర్తః? ప్రాగాదర్శాత్ ప్రత్యక్ కాలకవనా ద్దక్షిణేన హిమవంత ముత్తరేణ పారియాత్రం యద్యేవం కిష్కింధగాంధికం శకయవనం శౌర్యక్రౌంచం ఇతినసిధ్యతే ఏవంత ర్హ్యార్యనివాసా దనిరవసితానాం కః పునరార్యనివాసః? గ్రామో ఘోషో నగరం సంవాహ ఇతి ఏవమపి యఏతేమహాంతస్సంస్త్యాయా స్తేష్వభ్యంతరా శ్చండాలా మృతపాశ్చ వసంతి తత్ చండాలమృతపా ఇతి నసిధ్యతి ఏవంతర్హి యజ్ఞాత్కర్మణోఽనిరవసితానాం ఏవమపి తక్షాయస్కారం రజకతంతువాయం ఇతి నసిధ్యతి ఏవంతర్హి పాత్రా దనిరవసితానాం యైర్భుక్తే పాత్రం సంస్కారేణ శుధ్యతి తే అనిరవసితాః యైర్భుక్తే పాత్రం సంస్కారేణాపి నశుధ్యతి తే నిరవసితాః ఇతి.

ఆర్యావర్తము నుండి వెడలఁగొట్టఁబడని శూద్రులకు సమాహారము వచ్చుననిన నార్యావర్తమునుండి వెడలఁగొట్టఁబడిన శకయవనాదులకు సమాహారము రాకపోవలసివచ్చును. కిష్కింధగాంధికం శకయవనము సమాహారము సిద్ధింపవలెనని చెప్పిరి. ఇక్కడ శకయవనులు శూద్రులెట్లగుదురు? యవనులు తురుష్కులని ప్రసిద్ధికలదుగనుకఁ త్రైవర్ణికేతర మనుష్యపరమే శూద్రశబ్దమనుట న్యాయ్యము. ఏవంతర్హి యజ్ఞాత్కర్మణో అనిరవసితానాం ఏవమపి తక్షాయస్కారం రజకతంతువాయం ఇతి నసిధ్యతి యనిరి. యజ్ఞకర్మములం దధికారముగలశూద్రులకు సమాహారము వచ్చునందురేని యజ్ఞకర్మములం దధికారములేని తక్షాయస్కారులకును రజకతంతువాయులకును సమాహారము ఘటింపకపోవలసివచ్చునని యాపత్తినిచ్చిరి. ఇక్కడ వడ్రంగులకుఁ గమ్మరులకుఁ

జాకలులకు సాలెలలకు యజ్ఞాధికారము లేదని సాక్షాచ్ఛేషావతార మగు పతంజలిమహర్షి చెప్పఁగా నందుకు విరుద్ధముగాఁ జండాలురుకూడ యజ్ఞములు చేయవచ్చుననియు నీయర్థము శ్రుతులందే కలదనియు శ్రుతుల కన్యార్థము చెప్పెడి యీశాస్త్రులుగారివాదము న్యాయ్యమని ప్రాజ్ఞు లెట్టుల గ్రహింతురో గమనింపఁజాలము. యోగశాస్త్రప్రణేత యగు పతంజలికంటెఁగూడ గొప్ప శ్రుత్యర్థగ్రహణశక్తియు సమదృష్టి యుఁ గలవారు కాఁబోలు! మేముమాత్రము నమ్మలేము. మఱియొకటి. యైర్భుక్తే పాత్రం సంస్కారేణ శుధ్యతి తే అనిరనసితాః ఎవరుభుజించిన పాత్రము సంస్కారముచే శుద్ధమగునో వా రనివసితులని చెప్పినదాని కెవరు హవ్యకవ్యాదులందు వంటచేయరాదో వారు నిరవసితులనియు నెవరు వంటచేయవచ్చునో వా రనిరవసితులనియు మూవ్యాఖ్యయని వీరు వ్రాసిరి.

దీనికిసమాధానము. మహాభాష్యకారుల వ్యాఖ్యకు విరుద్ధముగా వ్యాఖ్యానముచేయఁబూనుట గొప్పసాహసకృత్యము. వ్యాఖ్యాతా సూపశంకర యనువాక్యము స్మృతికివచ్చుచున్నది. "ఆర్యాధిష్ఠితా శ్శూద్రా వైశ్వదేవస్య సగ్స్కర్తార"యను నాపస్తంబసూత్రముగ శూద్రులు బ్రాహ్మణునియింట వైశ్వదేవపాకముఁ జేయవచ్చుననియు నతఁడు ప్రతిదినము క్షౌరముచేయించుకొనవలయుననియు నిట్టి కొన్ని నియమములు చెప్పఁబడినవి. ఆ పాకార్హులగు శూద్రు లెవరనఁగా "శూద్రేషు దాసగోపాల కులమిత్రార్ధసీరిణః"యని వారు పేర్కొనఁబడిరి. వీరే పాకార్హులన నేలయనఁగా రజక తంతువాయ క్షురకాదులు పాకార్హులు కారని తాత్పర్యము. చండాలురును శూద్రుల లో నేస్మృతికర్తలును జేర్చియుండలేదు. వారాసూత్రమునకు విషయులే కారు, బ్రాహ్మణగృహములందు శూద్రపాకము యుగాంతర

విషయము. కలినిషిద్ధములలోఁ బరిగణింపఁబడినది. ధర్మజ్ఞసమయః ప్రమాణమని స్మృతికలదుగనుక నాపస్తంబసూత్రబలమున నిట్టివ్యాఖ్య చేయుదమనుట తగదు. స్వతంత్రముగా వీరుచేయు వ్యాఖ్య యప్రామాణికము. వీరికి శాస్త్రీయమని తోఁచినయెడలఁ జండాలురతో నిత్యపాకమును జేయించుకొని హవ్యకవ్యములలో మూని వేయవచ్చును. పతంజల్యాదుల వ్యాఖ్యలకును ధర్మశాస్త్రనిబంధనకారుల వ్యాఖ్యలకును విరుద్ధమగు వీరి వ్యాఖ్య మాకు గ్రాహ్యము కాదు.

“సౌధన్వనాస్తుహీనత్వా”త్తను మీమాంసాసూత్రమునను దద్భాష్యమునను సౌధన్వులు రథకారులు; వారి కాధానాధికారము కలదు అని చెప్పఁబడఁగా సౌధన్వులు కమ్మ రెడ్డికులస్థులని కొందఱు చరిత్రకారులు చెప్పుచున్నారని జి యస్. బి. సరస్వతివాదముతో నేకీభవింపఁజాలను వీరివాదము ప్రామాణికము కాదు. శ్రుతులందు ఛాందోగ్యమున “నథయ ఇహ కపూయచరణాః కపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా” పాపకర్మవంతులు పాపాత్మకములగు జన్మములఁ బొందుదురు. అవియెట్టివనినఁ గుక్కజన్మము పందిజన్మముఁ జండాలజన్మము నని చండాలురు పాపయోనులుగాఁ జెప్పఁబడిరి. “అత స్తేనో స్తేనోభవతి భ్రూణహా అభ్రూణహా చాండాలో అచాండాలః పౌల్కసో అపౌల్కస”యని భ్రూణహత్య చేసినవారితోఁ గలిపి బృహదారణ్యకమునఁ బఠింపఁబడిరి. చాండాలజాతి [చాండాలజాత్యవచ్ఛిన్న ప్రథమవ్యక్తి] జాత్యుత్పత్తియనుచోట నిదియే నా యాశయము సృష్టికర్తవలన సృష్ట్యాదియందుఁ గలిగినది గాదు. పురుషసూక్తములోఁ గాని భగవద్గీతలలోఁ గాని సృష్టిప్రకరణమునఁ బఠింపఁబడలేదు. శూద్రులలోని యంతర్భాగము రేని తన్నిర్ణాయక ప్రమాణములు లేవు. చండాలజాత్యుత్పత్తి స్మృతులందే చెప్పఁబడినది. అట్టిచండాలురును దద్వంశ్యులును సంకీర్ణులనుటకు సంశయము లేదు.

స్మృతిప్రసిద్ధముకాని స్వతంత్రచండాలజాతి కలదని చెప్పుటకు శబ్దసాధుత్వనిరూపణవిశ్రాంతమగు వ్యాకరణమునకుఁగాని నామలింగానుశాసనమునకుఁగాని యధికారములేదు. పాణినిసూత్రములోని శూద్రపదము లాక్షణికమని యిదివఱకే నిరూపించినారము మాతంగాంతేవాస్యాది శబ్దములు చండాలురు గ్రామమధ్యముననుండక గ్రామాంతమందు నివసించెదరనునర్థమును జెప్పునని నేను నిరూపించితిని.

దానికి మా తంగతి నగచ్ఛతి పాకశాలామితి మాతంగః పాకశాలను బొందనివాఁడు అంతే సమీపే వసతీ త్యంతేవాసీ సమీపమునముండువాఁడు అని మేము వ్యాఖ్యచేయుదుమనిరి. రూఢ్యర్థమునకనిరుద్ధమగు యౌగికార్థమును బదమునకుఁ జెప్పుట శాస్త్రపద్ధతి. అటుగానియెడలఁ గుశలప్రవీణాదిపదములవలె నిరూఢలక్షణ చెప్పవలసి వచ్చును. ప్రకృతమందు "అంతే గ్రామాంతే" అనియు "మా తంగతి నగచ్ఛతి గ్రామమధ్య మనియు నిఘంటువ్యాఖ్యాతృ"లనుభవానుసారముగాఁ జెప్పెడి యర్థములు పరిత్యజించి లోకవ్యవహారవిరుద్ధము ధర్మశాస్త్రవిరుద్ధము నగు నర్థముఁజెప్పుట యప్రామాణికము. పూర్వకాలమందుఁ జండాలురు త్రైవర్ణికుల గృహమధ్యములందు సంచరించెడి వారలని చెప్పెడి స్ఫుటార్థకములగు శ్రుతిస్మృతిపురాణవాక్యములు చూపింపఁజాలనప్పుడిట్టి "అంతే సమీపే వసతి" యను కల్పితవ్యుత్పత్తులు రూఢ్యర్థవిరుద్ధములు గనుకఁ బ్రామాణికులకు గ్రాహ్యములు కావు. నిఘంటు వ్యాఖ్యాతలు చెప్పిన వ్యుత్పత్తు లనుభవానుసారములు ధర్మశాస్త్రసమ్మతములు గనుక గ్రాహ్యములు. శ్రుతిస్మృతిపురాణములలోఁ జండాలస్పర్శము పాపదాయకము కాదని చెప్పెడివాక్యము గగనకుసుమాయమానము. కేవలయౌగికార్థమునుబట్టి మేము వ్యుత్పత్తి చెప్పినయెడల వారియిష్టమువచ్చినట్లు వారు చెప్పవచ్చును. అంతే సమీపే వసతియనియు "పాకశాలాం నగచ్ఛతి అర్థాత్ గృహమధ్యం

గచ్ఛతి" అనియు నర్థము చెప్పినయెడలఁ జండాలురయం దీశబ్దములు యౌగికార్థాసంభవమువలన ఘృతకోశాతకీశబ్దమువలెఁ గేవలరూఢములు కావలసివచ్చును. మేముచెప్పిన యర్థముప్రకారము యోగరూఢములగును. నేఁటివఱకును జండాలురు గ్రామమధ్యమునకు రాక గ్రామాంతమందు నివసించుటచూడ మావ్యాఖ్యయే మంచిదని పాఠకులకు స్ఫురింపకపోదు "లులం చలనం అయతీతి లులాయః; మహ్యతే ఆద్రియతఇతి మహిషః" అన్నంతమాత్రమున మనము లులాయులము మహిషములము ననుట న్యాయ్యమా? రూఢ్యర్థమునకు యోగార్థము యోగార్థమునకు రూఢ్యర్థము ననుకూలముగానుండుట న్యాయ్యము గనుక "అంతే సమీపే వసతి"యను నర్థమందయోగ్యతానిశ్చయము వలన వీరివ్యాఖ్య కేవలాసంగతము.

నిషాదశబ్దార్థవిచారము.

శ్రీరామచంద్రునికాలము ధార్మికభూయిష్టము. ఇప్పటివలె స్వచ్ఛందచారులకవకాశములేదు. కనుకనే శూద్రుఁడు తపస్సునాచరింపఁగా నాపాపమున బ్రాహ్మణపుత్రుఁడు మృతుఁడైనపుడు ధర్మవ్యవస్థాపకుఁడగు శ్రీరామచంద్రుఁడు తపోనిష్ఠుఁడగు శూద్రుని వధించి ద్విజసుతుని గాచెనని రామాయణమునఁగలదు, ఇట్టి శ్రీరామచంద్రునకు మిత్రుఁడై మత్స్యబంధననౌకావ్యాపారములచే జీవించు నిషాదుఁడగు గుహుఁడు చండాలుఁడని చెప్పెదరే! వీరిసాహసమున కవధియేమి?

రామాయణమున బాలకాండమునఁ ద్రిశంకుమహారాజు గురుశాపమునఁ జండాలత్వముఁబొందెననియు నాయన యాకారముచూచి తత్క్షణమే పౌరులు స్పర్శభీతులై పరుగెత్తిరనియు వర్ణింపఁబడినది. చూడుఁడు. రామా॥ బా॥ సర్గ అర్ధరాత్రే వ్యతీతాయాం రాజా

చండాలతాంగతః నీలవస్త్రధరో నీలః పురుషో ధ్వస్తమూర్ధజః చిత్ర మాల్యానులేపశ్చ ఆయసాభరణోఽభవత్ తం దృష్ట్వా మంత్రిణస్సర్వే త్యక్త్వా చండాలరూపిణం ప్రాద్రవన్ సహితా రామ పౌరా యేస్యానుయాయినః [పాపవశమునఁ జండాలత్వమునుబొందిన త్రిశంకుఁడు నీల వస్త్రధరుఁడును నీలవర్ణుఁడును బరుషుఁడును ధ్వస్తరోమములుకల వాఁడును జిత్రమాల్యాంబర ధారియు లోహాభరణుఁడు నాయెను. ఆయనను జూచి మంత్రులును బౌరులును బాఱిపోయిరి.] మఱియొకశ్లోకమున "క్షత్రియో యాజకో యస్య చండాలస్య విశేషతః కథం సదసి భోక్తారో హవి స్తస్య సురర్షయః" అని చండాలుఁడు యాగము చేయుట కర్హుఁడు గాఁడని చెప్పఁబడినది. శ్లో॥ బ్రాహ్మణా వా మహాత్మానో భుక్త్వా చండాలభోజనం కథం స్వర్గం గమిష్యంతి విశ్వామిత్రేణ పాలితాః॥ అని బ్రాహ్మణులు చండాలాన్నముతిని యెటుల స్వర్గముఁ బొందెదరని చెప్పఁబడియె. శ్వాసచండాలునియన్నము భుజించిన నరకమనియు శ్వాపచండాలుఁడు యాగానర్హుఁడనియు రామాయణము చండాలుఁడు స్పర్శానర్హుఁడు సర్వధర్మబహిష్కృతుఁడు నభోజ్యాన్నుఁడునని చెప్పుచుండఁగా నా రామాయణము శ్రీరామమిత్రుఁడగు నిషాదుఁడు చండాలుఁడని చెప్పినదని పూర్వాపరపరామర్శశీలు లెటుల గ్రహింతురు? ఇదిగాక "తత్ర రాజా గుహోనామ రామ స్యాత్మసమ స్సఖా। నిషాదజాత్యో బలవాన్ స్థపతి శ్చేతి విశ్రుతః" అను శ్లోకమున స్థపతిపదము "నిషాదస్థపతిం యాజయేత్" అను శ్రుతి నుక్త నిషాదుఁడితఁడేయని స్ఫుటపఱచుచున్నది. "తతో గుణవదన్నాద్య ముపాదాయ పృథగ్విధం అర్ఘ్యం చోపానయేత్ క్షిప్రం వాక్యంచేద మువాచహ భక్ష్యం భోజ్యంచ పేయంచ లేహ్యంచేద ముపస్థితం శయనానిచ ముఖ్యాని వాజినాం ఖాదనంచ తే గుహ మేవం బ్రువాణంతు రాఘవః ప్రత్యువాచహ॥

## —* సత్యసంధనృపతివృత్తాంతము. *—

క॥ కర్ణోత్పలయనియచ్చట వర్ణితమగు మఱియునొక్క వరతీర్థంబున్
స్వర్ణదిసమమై యుండెడుఁ, బూర్ణశ్రద్ధ నటఁ గ్రుంకి పూతుఁ డెవండౌ, ౨౯౭

సీ॥ అధికశ్రమంబుమై నార్జించి యందందు దాఁచియుంచిన భూరిధనముతోడఁ
బేరాపదలలోన బిట్టుక్కుఅరువచ్చి సాఁకుచుండెడు ప్రాణసఖులతోడఁ
బరు లెత్తివచ్చినపట్లనేనియుఁ దన క్రమముపీడని పరాక్రమముతోడ
వేదశాస్త్రపురాణవిహితాచారబంధంబు వాయని స్వధర్మంబుతోడ
నగ్నిసాక్షికముగఁ బెండ్లియాడఁగఁబడి కష్టసుఖములఁ బాల్గొను కాంతతోడ
నెక్కుడేటికి నెదియెది యిష్టతమము దానితోనెల్ల నెడఁబాయఁ డానరుండు ౨౯౮

వ॥ తొల్లి యిక్ష్వాకువంశంబున సత్యసంధుండను నొక రేఁడు సకలసద్గుణసనాథుండై పేరుమోసియుండుటయు నతనికి మంగళాంగియగు నొక్కకూఁతు రుదయించె, బహుపుత్రుండగు నప్పార్థివున కొక్కరితయే బిడ్డ కలుగుటంజేసి భూసురులతోడను భృత్యామాత్యులతోడను బహువారంబులు యోజించి ౨౯౯

క॥ "కర్ణస్థపు టుత్పలమున వర్ణింపఁగ నర్హమౌ సువర్ణముతో నీ
పూర్ణేందువదన గలిగె సువర్ణమునకుఁ దావి యబ్బువైఖరి నాకున్ ౩౦౦

క॥ బహుపుత్రుఁడనగు నా కీదుహిత యొకర్తె యుదయించెఁ, దొయ్యలి రూపున్
బహువర్ణనీయ,యందున రహిఁ గర్ణోత్పలయటంచు వ్రాసెదఁ బేరున్" ౩౦౧

వ॥ అని బారసాల నిర్వర్తించుటయు నాబాల చంద్రమసియుగు కలవిధంబున దినదినాభివృద్ధిం గాంచుచు లాలనపరులగు బంధుజనుల కాహ్లాదకారిణియై యొకరిచేతి నుండి యొకరిచేతి కరుగుచుం గ్రమంబుగా యౌవనవతియయ్యె, నంతఁ బృథివీపతి యాయమ నీక్షించి

ఆ॥ 'ఎవరికిత్తునీమె? నిద్దాని కనురూపుఁడైనయట్టివరుఁడు గానరాఁడు,
స్వర్గమునను మఱియుఁ బాతాళమునఁగూడ దొరకఁడింక నర్హ్యకొణ మెద్ది?' ౩౦౩

వ॥ అని బహుధా చింతించి

క॥ "అడిగెద వేలుపుఁబెద్దను, గడఁగెదఁ దద్వక్ష్యమాణగతి జరుపంగన్
దడవొనరింపక పని యట కిడుమనియనువాని కెలమి నిచ్చెదఁ బుత్రిన్" ౩౦౪

వ॥ అని నిశ్చయించుకొని కూఁతుం దోడ్కొని బ్రహ్మలోకంబున కరుగుసరికి నతనికి సంధ్యాసమయంబగుడు సాయంతనక్రియోత్సుకుండై సమాధినిష్ఠంబూనె,

సత్యసంధుండు తత్సమాప్తిం బ్రతీక్షించుచు నికటంబునఁ గూరుచుండె, నబ్జయోని యష్టదళహృదయపద్మకర్ణికామధ్యంబునఁ బలువర్ణంబులఁ దిరంబై విరాజిలు నాత్మీయం బాత్మ నవలోకించి యానందాశ్రుపరిపూరితనేత్రుండును బులకాంకితతనూరుహుండును నై యాచమించి చరణంబులు గడిగికొని పలుదెసలుపరికించి స్వర్లోకవాసు లందఱిచేతను బ్రణతుండై యుండుతఱి నారాజు శుభాననయగు సుతతో సహితంబుగా జోతవెట్టి

శా॥ 'దేవా! మర్త్యమునుండివచ్చితిని, నాదేశంబు నానర్త, మ
చ్చో విఖ్యాతుఁడ, సత్యసంధుఁడను దత్క్షోణీధవుండం, దను
శ్రీవిద్యోతితదిక్సమూహయగు నీసింగారి నాకన్య, యీ
పూవుంబోఁడికి యోగ్యుఁడైనవరుఁ డీభూమిం దటస్థింపమిన్ ౩౦౮

తే॥ అరుగుదెంచితి నీమ్రోల, కందువలనఁ దగినమగనినిజూపు మీ తలిరుఁబోఁడి,
కెవనికిమ్మనిచెప్పెదో యీవు వానికిచ్చి యుద్వాహమొనరించి యేలమిగాంతు'

వ॥ అనవుడు బ్రహ్మదేవుండు ౩౦౯

ఉ॥ "త్వత్తనుజాతకుం దగినధర్మపతిన్ గుఱియించి యగ్గిదే
నిత్తరి నేపుమాంసునకు నిచ్చుటకుం దగదంచుఁదోఁచెనా,
కుత్తముఁ బెద్దవాని స్వకులోద్భవుఁ జూచి కులాభివృద్ధికై
యిత్తురుపండ్రు లాత్మభవ నెంతయు ధర్మస్మృతిన్ స్వకీర్తికై, ౩౧౦

ఉ॥ ఈభవదీయపుత్రికి మహింగల యెల్లనృపాలసూనులున్
శోభనె కాక యీడునను న్యూనతగాంతురు, నిమ్మ హేతువున్,
నీభవనంబునుండి యిటు నీవరుదెంచు ననంతరంబునన్
భూభువనంబునందుఁ జనె మూఁడుయుగంబు లిఁకేమిచెప్పుదున్, ౩౧౧

చం॥ కడచని రీవు పూర్వమునఁ గన్గొనియుండిన యెల్లమానవుల్,
పుడమిని బ్రస్తుతంబున నపూర్వపుసృష్టి సెలంగనయ్యె, నీ
గడబిడ నీదుకొందమున గాత్రహ్యముగామికినుండు హేతు వో
యొడయఁడ! లౌకికంబగుచునొప్పెడి నాదుమహత్త యయ్యెడిన్, ౩౧౨

ఆ॥ శ్లేష్మమాత్రములకు స్థిరతరస్థానమై గర్హ్యమైన మనుజకాంత సురలు
సతినిజేసికొనఁగ మతిలోన నేని బొ మిష్టపడరు, పెక్కులేల చెప్ప? ౩౧౩

కం॥ కరితురగాదిక యుష్మత్పరివారముఁ బుత్రముఖర బంధుగణంబున్
మరణించినయవి, యెవియెవి పరిచితములొనీ కవెల్లఁ బ్రళయముగాంచెన్, ౩౧౪

ఆ॥ కాన సత్యసంధమానవాధీశ్వర ! యచటికేగి యేమియాచరింతొ ?
దిందవయుండుమింకనీవు సుఖంబుగా ముద్దుకూతుతోడఁ బెద్దపొద్దు" ౩౧౬

వ॥ అని పలుకుటయు నాతఁడంగుల కురరీకరించెఁగాని తత్తనుజాత దుఃఖార్తయై యెద్చుచు నిట్లనియె,

ఉ॥ "ఉండను బ్రహ్మలోకమున నోపిత ! నేను సఖీజనముక్తనై,
దండను జుట్టులుండమి మదంబుఘటింపదు నాకుఁ గాన నా
నిండిన ప్రేమఁగాంచు జననిం బెడఁబాయకయుండ నేను ము
న్నుండినయాస్థలంబునకె యొయ్యఁ జనన్ మది నిచ్ఛయించెదన్, ౩౧౭

ఆ॥ ఎవరితోడఁగూడి యే నాటలాడితి నట్టి సఖులు నాకు హస్తగమిడుదు,
రూరకిచటఁ బెండ్లి పేరంటములులేక యునఁగనేల ? లెమ్ము, చనుదమటకు" ౩౧౮

వ॥ అనియిట్లు వచించుటయుఁ బార్థివోత్తముండు స్నేహార్ద్రచిత్తుండై యాయపుం దోడ్కొని స్వదేశంబునకుంజని స్థలస్థానంబుల జలస్థానంబులను జలస్థానంబుల స్థలస్థానంబులను దన్మధ్యంబునఁ గొత్తకొత్తలోకములను గొత్తకొత్త ధర్మంబులను గనుంగొని ప్రశ్నించియు నొకనితో నొకనికిఁగల సంబంధంబును దెలిసికొనంజాలక మానిసిగాలి సోఁకినంతనె యాగ్రస్తుండయ్యెఁ, గన్యయు నట్లు శ్వేతమూర్ధజయు వళిపూరితయు శీర్ణదంతయుఁ జ్యుతస్తనయు నమనోజ్ఞయు విరూపాంగియుఁ జిపిటాక్షియు నై కనుపట్టె, నట్లు మాటిమాటికిని గడగడవడంకుచు నారాజన్యుఁ "డిచ్చటఁ బ్రభు వెవరు ? దేశమెయ్యది ? పట్టణము పేరేమి ?" యని యడుగుటయు భూజనులు. ౩౧౯

కం॥ 'దేశము పేరానర్తం, బీశుండు బృహద్బలుండు, నీతధర్మజ్ఞుం,
డీ శ్రేష్ఠమైనపురము మహాశయ ! ప్రాప్తియను పేరఁ ఖ్యాతము జగతిన్, ౩౨౦

సీ॥ ఎట నంతరింద్రియపటుత నిర్మూలించి యోగంబు నేర్చుచునుండి రార్య
లెచట నుగ్రతపంబు నెంతయు నిష్ఠమైఁ జేయుచుండిరి మునిశ్రేష్ఠు లొకట
బహిరింద్రియంబులపావనేతరచేష్ట లుపరమింపఁగఁజేయుచుండి రెచట
స్నానసంధ్యాజపస్వాధ్యాయనిరతిమై నెచొటుఁబాయకయుండి రిద్ధవిప్రు
లచొటు భ్రమతీసమాహ్వయహ్రదినీవరంబునుండి విస్పష్టమై రాణగాంచి
యున్న గర్తాభిధానతీర్థోత్తమంబుఁ బావనతమంబుఁ బుణ్యసంప్రాపకంబు "

వ॥ అని వాక్రుచ్చుటయు నతం డాత్మజాత నాలింగనంబు చేసికొని పెద్దపెట్టున నేడ్వందొడంగె, వృద్ధులగు నయ్యిరువురంగని జనులందఱుం జనుదెంచి కృపాభువులై తాముము గన్నీరు గార్చుచు ౩౨౧

ఆ॥ "ఎందుకయ్య తాత! యీయవ్వఁ గాఁగిటఁ గ్రుచ్చి యేడ్చుచుంటి గోడు నునుచు?
బంధు వెవ్వఁడేని పరమపదించెనో, యర్థనష్టి యైనయదియొ చెపుము, ౩౨౩
కం॥ ఎవఁడేని బట్టుకొని నిను నవమానితుఁ జేసినాఁడొ, యాలస్యములే
క వచింపు, శిక్షకుఁడు మాయవనీట్బృహద్బలుండు, హతునొనరించుఁ, ౩౨౪
ఆ॥ ధర్మవిదుఁడు దుష్టదమనుండు శిష్టసంరక్షకుండు మామరాజు గాన
నీకుఁగలిగినట్టిశోకంబు పోకార్చి సౌఖ్యమొసఁగఁగలఁడు, సత్యమిద్ది" ౩౨౫
వ॥ అనివకార్ణించుటయు సత్యసంధుండిట్లనియె,
క॥ "ఆనర్తదేశమునకును క్ష్మానాథుఁడ, సత్యసంధసంజ్ఞుఁడ, నేత
న్మానవతి నాదుకూఁతురు, దీనికిఁ గర్ణోత్పలాఖ్య స్థిరపడియుండెన్ ౩౨౬
ఉ॥ వేనికినిత్తు దీనినని వేడుకతోడ విరించిపాలికిన్
నే నడుగంగఁబోతి, నట నెమ్మి ముహూర్తమువోలె నుండితిన్
గాని యదేమొ వెండియును క్ష్మాస్థలికిం జనుదెంచి చూడఁబో
మానవులార! చిత్రముగ మాఱెఁ బ్రపంచపురీతి యంతయున్ ౩౨౭
వ॥ అనవుడుఁ దజ్జనులు విస్మయోత్ఫుల్లలోచనులై పోయి యంతయు బృహ
ద్బలునకు విన్నవింప నతండు పాదచారిగనే యతిరయంబున నన్నృపునికడ కరుదెంచి
కేలుమోడ్చి గోసిలియొగ్గి నిలువంబడి ౩౨౮
క॥ 'స్వాగతము దేవ! మతి సుస్వాగత మీభృత్యువలన స్వకరాజ్యంబున్
వేగఁ గొని యేలుము, బాగుగ దానంబు లిమ్ము బ్రాహ్మణతతికిన్ ౩౩౦
వ॥ అనిపలుకుటయు నతని నాలింగనంబుఁ జేసికొని పలుమాఱులు శిరస్సు మూ
ర్కొని యశ్రుపరిక్లిన్నవదనుండై గద్గదస్వరంబున నిట్లనియె,
ఉ॥ 'చేయఁగఁ జేయ రాజ్య మది జీర్ణమయ్యెనది నాదుచేతిలో,
నీయఁగ నీ యువిత్త మది యెక్కువయయ్యెను యాచకాళికిన్
నాయన! చేసినాఁడ సవనంబు లనేకము గాన బిడ్డతో
నేను దపంబొనర్తునిఁక నీవెకఁ గ్రమ్మఱ యౌవనంబు రాన్' ౩౩౨
వ॥ నావుడు బృహద్బలుండు ౩౩౩
ఆ॥ "సత్యసంధనృపతి స్వతనయం దోడ్కొని యెటకో యరిగి మరల నెంతకాల
మునకు రామి మంత్రిజనము తత్సుతుఁడైన సుహయుఁ బ్రభునిజేసె క్షోణికనియు
క॥ ఏఁడగునతనికి డెబ్బదియేడవపురుషుండనగుచు నే నుదితుఁడనై
నేఁడు భవదీయవంశపు వాఁడనఁగా నుంటిననియు వారును వారున్ ౩౩౫
క॥ చెప్పఁగ వంశపరంపర యెప్పుడు వినుచుందుఁ గాన నీ పావనమై

యొప్పెడి సుస్థానము నీ గొప్పతపశ్చర్యకు ననుకూలముగాదే? ౩౩౬
మ॥ రమణీయంబు శుభకరంబు నగు గర్తాతీర్థ మీస్థాన మో
సుమహీశా ! తనుజాతతోడ నిటు సంశుద్ధిం దపంబుండు, ని
త్యము సంధ్యాత్రయమందు నీదు పదపద్మద్వంద్వ మర్చించి సే
వ్యముఁబొందంగలవాఁడదప్పు, కనుకంపంజూడుమీ పుత్రికన్" ౩౩౭
వ॥ అనినవిని సత్యసంధుండు మఱియు నిట్లనియె, ౩౩౮
ఆ॥ "హాటకేశ్వరమున హరలింగమును దొల్లి నిలిపియున్నవాఁడ నేను బుత్రి !
యట్లుగావున సదారాధనముచేతు, మటకె వేగఁబంపుమయ్య మమ్ము" ౩౩౯
వ॥ ఇట్లాభూపాలకు లిరువురు భాషించుకొనుచుండఁ దచ్చిరకాలాగమనవార్త విని భూసురులు కౌతుకాన్వితులై గర్తాతీర్థంబునుండి పఱతెంచిరి, యంత నపార్థివుండు వారలకు ధనంబులిచ్చి సాంజలియై నిలువంబడి స్వర్గసమాచారంబు సాదరంబుగా వినుండని నుడువుటయు నాబ్రాహ్మణులందఱు యథాజ్యేష్ఠంబుగను యథాసుఖంబుగను నరేంద్రు నాలుగుదిక్కులం గూర్చుండి విస్మితులగుచు "నెట్లు పోయితివి? మరల నెట్లువచ్చితివి? బ్రహ్మతో నేమేమిమాటలాడితివి?" యని బ్రహ్మలోకవృత్తాంతం బంతయు నడుగఁ గథాంతంబున సత్యసంధుఁడు బ్రాహ్మణులంగూర్చి
సీ॥ జపతపస్స్వాధ్యాయసంపన్నులై విప్రులే పట్టణంబున నెలమినుండ్రు
సమిధాజ్యముఖర జాజ్వల్యమానంబులై యింటింటఁ ద్రేతాగ్ను లెచటనలరు
వర్ణాశ్రమాచారవర్తిష్ణులే పౌరులి బ్రాహ్మణక్షత్రవిట్పాదజాతు
లిహపరసౌఖ్యంబు లెనయఁగల్గిన మేటు లేవీటనుండెడి యెల్లమనుజు
లా చమత్కారపురమున కరిగియొకపు డమ్మహైశ్వర్యమీక్షించి యాత్మలోన
"నిట్టినగరంబు నిర్మించియిచ్చినట్టి తచ్చమత్కారుఁ డత్యంతధన్యుఁ"డనియు ౩౪౧
ఆ॥ "అతనియశము దిశల నక్షయంబైయుండె" ననియుఁ బ్రస్తుతించి "యట్లె యొక్క
పురము నేలు పఱచి భూసురశ్రేష్ఠుల కిచ్చువాఁడ, ఖ్యాతినెనయువాఁడ, ౩౪౨
చం॥ అనియిటు పెద్దకాలమును నాత్మ విచారము సేయుచుండఁగా
నొనరెను బ్రహ్మలోకమున కోజఁ బ్రయాణ మవాంతరంబుగన్,
గనుక మదీయమానసము గాఱియపెట్టెడు నిద్దిమాత్రమె యో
జనవర ! లేదు దేనను విచారము సిద్ధుఁడనౌట నన్నిటన్, ౩౪౩
ఆ॥ కాన నీమహాత్మగణము సంబంధులౌ పుడమివేలుపులను బోయి వేఁడు,
మిత్తు యుష్మదాజ్ఞ నేను సుస్థానముంజేసి వారలకును క్షితితలేంద్ర!" ౩౪౪
వ॥ అనవుడుఁ దద్భూపాలుండు ౩౪౫

కం॥ "నాపైఁ గరుణించుచు నో భూపలు ! మాభూపుఁడిచ్చుపట్టణము గొనుం,
డాపదలేకుండఁగ నేఁ గాపాడెద, మత్కులంబు గాపాడుఁ డొగిన్" ౩౪౬

వ॥ అని కొందఱ నెట్టకేఁ కొప్పించి వీరి కీయవలసినదని సత్యసంధునకు నివే దింపుటయు నాపృథివీపతి యందఱచరణంబులును గడిగి పురనిర్మాణార్థ ముత్తమ భూమి నర్పించి నీ వీపురంబునకు యోగ్యతసంపాదింపవలయునని బృహద్బలున కొన తిచ్చి బిడ్డతోడం బయనమై హాటకేశ్వర క్షేత్రంబున కరిగి ప్రీతిమైఁ బెద్దకాలంబు తపంబుండె, నాకర్ణోత్పలయు నొకపుణ్యజలాశయంబునాశ్రయించి తత్తీరంబున గౌరిం బ్రతిష్ఠించి శ్రద్ధమైఁ దపం బొనరించె, నంతఁ గొంతకాలంబునకు బృహద్బ లుండు సపుత్రకంబుగా హతుండగుటయు నగ్రాతీర్థవాసులగు బ్రాహ్మణు లెల్లరుం గుందుచు సత్యసంధు సమీపించి ౩౪౭

తే॥ "పట్టిదానంబు నీయొద్దఁ బట్టిమేము పొట్టకూటికి గతిలేక పొక్కుచుంటి,
మెద్దియో జీవనోపాయ మీవుమాకు వే విధింపు స్వధర్మాభివృద్ధిపొంద, ౩౪౮

కం॥ వృత్తినిగల్పింపఁగ నుత్తముని బృహద్బలాఖ్యు నొప్పించి, తతం
డిత్తఱి రణరంగంబున మృత్తికివశుఁ, డింకనెట్లొ మీఁదటి విధముల్ ౩౪౯

వ॥ అనినవిని సత్యసంధుండిట్లనియె,

తే॥ "సన్యసించిన నాకెట్లు సాధ్యమగును మీకు వృత్తినిగల్పించి సాఁకుచుంట,
కస్మదన్వయమున నొక్కయర్భకుఁడును నుండఁ,డుండిన వాఁడేని యోముచుండె,

తే॥ కాన నామీఁద సంపూర్ణకరుణయుంచి యరుఁగుఁ డాత్మీయగృహములకవనిసురులు!
తావకాదృష్టమునన యేతద్బృహద్బలుఁడు రణోర్విం బ్రవేశించి చెడిసినాఁడు"

వ॥ అనియిట్లు పలుకుటయు నాబ్రాహ్మణులు నిజంబయని స్వస్థానంబులకేగిరి, సత్యసంధుండును దపంబునకుఁజనియె,

ఆ॥ ఇట్లు బిడ్డతోడ నెంతయుఁదపముండు సత్యసంధనృపతిసవిధమునకు
మాననీయులౌ చమత్కారపుర విప్రులెల్ల రేగుదెంచి యిట్టులనిరి, ౩౫౪

కం॥ "సందేహంబులుగలుగఁ, డెందములం దొకరినొకరు డీకొనుచును మే
మందఱ మవమానంబులఁ బొందుచునున్నార మరయుభూపతిలేమిన్" ౩౫౫

వ॥ అనియిట్లు సన్యస్తుండగు సత్యసంధమహీపతి బ్రాహ్మణులచేఁ బ్రార్థింపఁబడి కృతాంజలిపుటుండై. ౩౫౬

ఆ॥ "తగను నేను మీదుతగవులఁ దీర్పంగఁ, దగను మొట్టమొదలె ధరణినేల,
సత్పుత్రశత్రుములను నాకలఁబడవైచి ముక్కికొనుచు మూర్ఖమానిసినొకటి" ౩౫౭

వ॥ అని విన్నవించుకొనుటయు బ్రాహ్మణులిట్లనిరి "

ఉ॥ " దర్పమునం దహంకృతిని దక్కువవారము కాము మేము, బ
ల్పేర్పడియున్న యట్టి పృథివీపతికన్నను మిన్నగానె మా
కేర్పడియుండె జీవనము, లించుకయేని కొఱంతలేకయే
నేర్పున స్థానకృత్యములు నిర్వహణంబొనరింతు మియ్యెడన్ : 3౫౯

మ॥ ఇటు స్వస్థానమునందయుందుము ప్రభూ ! యే, మేమహారాజో యు
త్కటభూభుక్తి నొసంగియుండెఁ బలు కేదారమ్ములన్ మాకు, వీఁ
దటి మన్నీఁడులు వృద్ధి సేసిరవి, యాతర్వాత నిన్ దొట్టి యు
ద్భటరాజన్య బృహద్బలాంతమును మా భాగ్యంబు పెంపొందెడిన్, 3౬౦

కం॥ ఆనర్తదేశమున కెవఁ డూనును సర్వాధిపత్య మోరాయేలిక ! యా
మానవుఁ డెల్లగృహస్థుల దానంబులచేత మిగులఁ దనుపుచునుండున్ 3౬౧

కం॥ ఏయొద్ద నేమియనఁగల మోయవనీపాల ! యెటులనొసఁగితొ వృత్తుల్
పాయనికృప నెటుసాఁకితొ యీయఖిలము నీదునెడఁద కెఱుకయె కానన్ 3౬౨

ఆ॥ భూమిదానకరణపూర్వకత్వద్రచితాగ్రహారవృద్ధి నరయుమయ్య,
మహిసురాళి స్వీయమర్యాద చెడకుండ సౌఖ్యముండువిధము సలుపుమయ్య" 3౬3

వ॥ అనివాక్రుణించుటయు నతండు పెద్దయుంబ్రొద్దు విచారించి యుపమన్యు వంశసంభవులును వేదపారగులును నగు గర్తాతీర్థసముద్భవులఁ బిలువంబంచి నమస్కరించి సాదరంబుగా నిట్లనియె, 3౬౪

తే॥ " మామకస్థానమందున మనెడిద్విజుల యఖిలకృత్యంబులును మీర లన్వహంబు
భృత్యులుంబోలెఁ జేయుచు వినయులగుచు మెలఁగవలయును,దద్రక్ష సలుపవలయు"

వ॥ అనిచెప్పి చమత్కారపురభూసురులదిక్కు మొగంబై 3౬౫

కం॥ "మర్యాదాకారము బుధవర్యశ్లాఘ్యంబునగుచు వర్తించెడి మీ
యార్యోక్తియెల్ల శిరసా ధార్యము వీరలకు న్యాయధర్మము చెప్పన్, 3౬౬

ఆ॥ రాజకీయముల నరాజకీయములను సంశయాత్ములగుచు జగడమాడ
యుష్మదుభయవాద మూహించి వీరలు మంచిచెడ్డలను విధించువారు, 3౬౭

ఆ॥ అస్మదీయకీర్తి యభివృద్ధిఁజెందింపనెడఁదలందు మీర లీర్ష్యవదలి
పుష్టియుతులుగాఁగ బోషించుచుండనొ వీరినందఱను నుదారులార ! 3౬౮

ఆ॥ సర్వకృత్యములను సర్వదా భవదీయవర్తనమునకనిదె వాస్తవముగ
నిచ్చుచున్నవాఁడ నేను గర్తాతీర్థజనితులైన యీద్విజాతిజనుల, 3౭౦

మత్తకోకిల॥ శ్రుతిచతుష్టయసూచితంబగు సుప్రతిష్ఠ ఘటించుచీ
కతులితంబుగ మీరుచెప్పినయట్ల వర్తిలుఁ డందఱున్
క్షితిసురేంద్రులు ! లక్షమందివచింత్రుగాక భవత్పర
స్థితులవాక్యము లించుకైనను స్వీకరింపరుఁ డాత్మలన్ " ౩౨౧

వ॥ అని వచించుటయు నాబ్రాహ్మణులు హృష్టులై వల్లెయని వారలం గొండొకని పోయి తదనుమతంబున సర్వదా సర్వకార్యంబులును నిర్వర్తించుచుండిరి, యంత నఖిలజనంబుల యఖిలకృత్యంబులను ధర్మవర్ధనియగు మర్యాద యేర్పడి పట్టణంబును వృద్ధికిఁదెచ్చె,నా గర్తాతీర్థద్విజులును దదనుగ్రహంబున నధికైశ్వర్యవంతులై సుఖం బుండఁ గొంతకాలంబున కమ్మహీపతి యప్పురంబున కరుదెంచి యవనీసురులనందఱం గనుంగొని ౩౨౨

కం॥ " అలఘుతరమైన మీకృపకలిమిని నీక్షేత్రమందు ఘనతపమును నే
సలిపినవాఁడను గావున నెలమిని స్వర్లోకమునకు నేఁగెదనింకన్, ౩౨౩

ఉ॥ పూజలొనర్పఁగన్ మఱియుభోగములం బొనరింపఁజేయఁగన్
భ్రాజితవృత్తులన్నియును బాలనసేయ మదన్వయంబునన్
రా జొకఁడేని లేఁడు భువిఁ బ్రస్తుతమందున, నుండియున్న నీ
రాజశిరస్క లింగమును రమ్మని దాఁపుచునుంటి వానికిన్, ౩౨౪

కం॥ కావున నీలింగమునకుఁ గాపింపఁగవలయు మీర ఘనతరపూజల్,
భూవిబుధులు రథయాత్రాసేవన మేటేట మీరె చేయుఁడు కరుణన్ ॥" ౩౨౫

వ॥ అనుటయు బ్రాహ్మణులిట్లనిరి. ౩౨౬

తే॥ " ఇటుఁ జమత్కారసూనుల యిరువదేడులింగముల మేము పూజింపఁగం గలిగితి
మిదియు నయ్యెడి నిరువదియెనిమిదవది, యీవు నిశ్చింతమైనుండుమింక భూప !

కం॥ ప్రతికార్తికమాసమునను గృతమగును రథోత్సవంబు గీతాదులతో,
క్షితినాయక ! బలిపూజలు వితతాహారాదికములు విరచింపఁబడున్ " ౩౨౭

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు నతండు హృష్టుండై స్వాశ్రమంబునకుం జని యాలింగంబున కభిషేకించి భక్తిమైఁ బూజించె, స్వవంశ మంతరించిన కతంబున నాతఁడిట్లు స్వలింగంబును బ్రాహ్మణులకర్పించెఁ, దల్లింగంబును గార్తిక మాసం బంతయు శ్రద్ధాయుతుండై యభిషేకించి పూజించుజనుండు ముక్తుండగునెడ్డి, నొక్కసంవత్సరము ప్రతిసోమవాసరంబునను విధివిధానంబున నభిషేకంబుగావించి పూజించునతండును మోక్షంబు గాంచఁగలఁడని మాతండ్రి చెప్పఁగా వినియుంటి"నని యిట్లు వచించుటయు ఋషులిట్లనిరి, ౩౨౮

# చందాయీవలసిన ప్రధాన పోషకులు.

౧ రాజా బెల్లపురకల వెంకటరాఘవేంద్రరావు బహదరు జాగీరుదారుగారు,
నవాబుపేట

## పోషకులు

౧ అల్లాడి లక్ష్మణరావుగారు, కరణం, జంగపల్లి
౨ సింగీతము అమృతరావుగారు, మక్తేదారు, కొన్నె
౩ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానకొండూరు

## సహాయ్యులు

౧ పట్వారి నారాయణరావుగారు, క్షీరసాగరము.
౨ నెల్లుట్ల నరసింహారావుగారు, చినమడూరు
౩ మెదక్ కిషన్‌రావు దేశముఖుగారు, నల్లపల్లి
౪ నార్నెపాటి వెంకటసుబ్బారావుగారు, నల్లపల్లి
౫ నరసింహస్వామివారు, యాదగిరి
౬ వీరకాయల రామారావుగారు, రాయగిరి
౭ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, కంగపల్లి
౮ శివలెంక రామలింగయ్యగారు, డాక్టరు, హనుమకొండ
౯ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, ఆక్టింగు కరణం, సోమయాజులపాలెము.
౧౦ చిక్కరాజు నర్సపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి
౧౧ [illegible] వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు
౧౨ కవులూరి నరసింహారావుగారు, ఈలపోలు
౧౩ గోపిశెట్టి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు

# అభినవసరస్వతి

పత్రికాధిపతి:— జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమ ధర్మబోధక గ్రంథములును ఖండనములును వ్యాసములును ప్రకటింపబడును. సంవత్సరం 1 కి రు 3—0—0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | అళ్వయాచార్యవిజయము | ... | 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి [సింహాద్రి వెంకటాచార్యులు] | | 0 | 4 | 0 |
| 6 | గురూపాసకపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతులు [సుమతిశతకమునకు సంస్కృతము] | ... | 0 | 2 | 0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 9 | విప్రహారాంధస ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 10 | చిత్తూరుజిల్లాతీగప్ప విమర్శనము [పత్రికాధిపతి] | ... | 0 | 4 | 0 |
| 11 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 12 | గురిగింజ | ... | 0 | 1 | 0 |
| 13 | పులిందావివాహము [పత్రికాధిపతి] | ... | 0 | 4 | 0 |
| 14 | కప్పలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 15 | శివానందలహరి [తంగెడ రామకృష్ణకవి] | ... | 0 | 4 | 0 |
| 16 | లక్ష్మీవిలాసము [రాయసము వెంకటపతి] | ... | 0 | 4 | 0 |
| 17 | నర్సారావుపేట శతావధానము [తిరుపతివెంకటీయము] | | 0 | 3 | 0 |
| 18 | పశ్యంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 19 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 20 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 21 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 22 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 23 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 24 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 25 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 26 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 27 | స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము | ... | 1 | 0 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,
జానపాడు, పిడుగురాళ్ళపోస్టు.
గుంటూరుజిల్లా.